## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015315

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బాలకథావళి.



గ్రంథకర్త,

దీపాల పిచ్చయ్యశాస్త్రి,

నెల్లూరు.



కళానిధి ప్రచురణము ౹౹

౧౯౩౩.



# ఒక మాట.



యుక్తియు చమత్కారమును గలిగి, నీతిని బోధించు చిన్నచిన్న కథలను- క్రిందితరగతులకు పనికివచ్చు శైలిలో వ్రాయవలయునన్న తలంపు నాకు చిరకాలముగాఁ గలదు. ప్రౌఢ ప్రబంధ రచనమునకంటె, రసమొలుకునట్లు చిన్న కథలను రచించుట చాల కష్టమయిన పని. అందును తరగతుల యంతరమునకు తగిన పదముల నేర్చి కూర్చుటకు మంచి మెలఁకువ కావలయును.

నే నీ పుస్తకమును, 2, 3 తరగతుల విద్యార్థుల కుపయోగింపవలయునని వ్రాసితిని. బాలుర కీ కథలతో పరిచయము కలిగిన పిమ్మటఁగాని, యీ రచనమున నే నెంతవఱకు కృతకృత్యుఁడ నైతినో తెలియరాదుగదా! ఈ నా తొలి యత్నము, విద్యా శాఖవారి యనుగ్రహమునకును, విద్యార్థుల ప్రేమమునకును పాత్రమగుచో తక్కిన తరగతులకును, తగిన పుస్తకములను వ్రాసి ప్రకటింతును.

గ్రంథకర్త.

# తొలిపలుకు

ప్రపంచమందు మనుష్యులు తెలివితో మెలగుటకు విద్య అత్యావసరము. అట్టి విద్యకు పునాది పసితనముననే వేయవలసియున్నది. పెద్దవారికి వలెనే పసిపిల్లలకును కథలను వినుటయందు ప్రీతి మెండని యెల్లఱకును తెల్లమైన విషయమే. అందును, ప్రౌఢ వయస్కులకును వృద్ధులకును పురాణేతిహాసములను చదువుటయందును, వినుటయందును ఆసక్తి మెండు; కాని పసిపిల్లలకు చిన్నచిన్న కథలయందే ప్రీతి యెక్కువ. కావున పసిపిల్లలకు, ప్రాథమిక పాఠశాలలయందు ఈ అనుకూలతను కల్పింపవలసినది అత్యావసరము. ఈ బళ్ళయందలి 1, 2 తరగతులలో కథలను పిల్లలకు చెప్పి వినిపించుటయు, తక్కిన తరగతులలో, వినిపించి, చదివించుటయు నవసరము. కథలు కేవలము వినోదకరములై హాస్యరసపూరితములై యున్నంత మాత్రమున చాలదు. ప్రతికథయందును- పిల్లలు పెద్దలై ప్రపంచమున తమసాటివారితోను, తమకన్న పిన్నలు, పెద్దలునగు వారితోను, ఇతర జీవకోటితోను ఉచితమయిన విధమున మెలగదగిన నీతులను బోధించునవిగా నుండవలెను.

ఇప్పటికే కథల పుస్తకము లనేకములున్నను, పై నుదాహరించిన అంశములను దృష్టియందుంచుకొని వ్రాసినవి యరుదు. శ్రీ. పిచ్చయ్య శాస్త్రి గారు పైని జెప్పిన విషయముల కన్నిటికిని, అత్యంతానుకూలముగా ఈ పుస్తకమును వ్రాసియున్నారు. కథలలోని కఠిన పదములకు అర్థములను, పుస్తకము చివర వ్రాసియున్నారు. అనుభవముమీఁద నిందలి శైలి యింకను సులభము చేయవలసినట్లేర్పడుచో రెండవ కూర్పున నట్లు చేయుటకును సంసిద్ధులై యున్నారు.

పసిపిల్లల కిట్లు చాల యుపయోగకరమైన పుస్తకమును వ్రాసిన ఈ గ్రంథకర్తగారికి ఉపాధ్యాయులును ప్రాథమిక, పాఠశాలల యజమానులును, పరీక్షాధికారులును తగిన ఆదరమునుచూపి, ఇట్లే మఱికొన్ని గ్రంథములను వ్రాయ ప్రోత్సహింతురని నమ్ముచున్నాను.

NELLORE,
4—1—33.

T. D. KRISHNA ROW,
*Dy. Inspector of Schools,*
**Kovur Range, Nellore Dt.**

# బాలకథావళి



## ౧ తెలివిగలబాలుఁడు

రాముఁడను నొక బాలుఁడు కలఁడు. వాఁడొకనాఁడు తనతండ్రి కట్టించుచున్న మేడను చూడఁబోయెను. పనివాండ్రు ఇటికెల గోడను, గచ్చుగోడను, గోడను మిక్కిలి యెత్తుగా కట్టుచుండిరి. రాముఁడు ఆగోడవంక ఱెప్పవాల్పక చూచుచుండెను. ఇంతలో వాని తండ్రివచ్చి "రామా, ఏమి అట్లు చూచుచున్నావు? నీవును గోడలుకట్టు పని నేర్చుకొనెదవా?" అని యడిగెను.

రాముఁడు:—లేదు నాయనా, ఇటికెలు అంత చిన్న వస్తువులు గదా! వానితో అంతటి పెద్దగోడ తయారగుట వింతగా తోఁచి చూచుచున్నాను- అనెను.

తండ్రి:—కుమారా, అందు వింత యేమియును లేదు. చిన్న చిన్న వస్తువులు కలియుట వలననే పెద్ద వస్తువు లేర్పడుచుండును. చిన్న చిన్న వాఁగులు కలియుటవలననే పెద్ద పెద్ద నదులు ఏర్పడుచున్నవి. చిన్న చిన్న ఊళ్ళు కలియుట వలననే పెద్ద పెద్ద దేశము లేర్పడుచున్నవి. ఇంతయేల ?

లోకమున గొప్పవారని పేరుపడిన పండితులందఱును దినమున కొక్కొక్క చిన్నపాఠమును చదువుకొనియేగదా అంతవారయిరి. పట్టు వదలక పనిచేయువానికి, ఎంత గొప్పపనియైనను సులభమగును. నీవును పట్టుదలతో నీపాఠములను ప్రతిదినము చదువుకొనుము. నీవును తప్పక గొప్ప పండితుఁడ వయ్యెదవు- అని చెప్పెను.

నాఁడు మొదలు రాముఁడు మిక్కిలి శ్రద్ధతో చదువుకొని పెద్ద పండితుఁ డయ్యెను.

---

## ౨ దోమ—తేనెటీగ

ఒకదినమున నొకదోమ ఆహారము దొరకక సకసకపడి ఒక తేనెటీఁగను యాచింపఁ బోయెను. అపుడు ఆ రెంటికిని ఇట్లు మాటలు జరిగెను:—

దోమ:— ఓ తేనెటీఁగా, నేను ఆహారములేక అల్లాడుచున్నాను; నీయొద్ద తేనె సమృద్ధిగానున్నది. నీవుకడుపునిండ త్రావి సుఖముగా నున్నావుగదా! ఈ బీద ప్రాణికి రెండు మూడు బిందువుల తేనె దానముచేసి పుణ్యము కట్టుకొనుము. నీవుచేయు నుపకారము ఊరకబోదు. నేను మనోహరముగా పాడగలను, అందముగా ఆడగలను. ఆటపాటలచేత నీకు వినోదము కావింతును. అంతేకాదు, నీ బిడ్డల

కును ఆటలు పాటలు నేర్పుదును: నావంటి యొక పాట కానిని నీవు పోషింపరాదా?

తేనెటీఁగ:—ఏమీ! దోమా, నీ సంగీతము నీకు ఆహారము నియ్యజాలదా? అయినచో, అట్టిపనికిమాలిన సంగీతము నాబిడ్డలకెందుకు? నీసంగీతమును నేర్చుకొనినవారు నీ వలె బిచ్చమెత్తుకొని జీవింపవలసినదే గదా! మాకు వలదు వలదు. నీవు ఎండకాలమున ఆహారమును కూడ బెట్టు కొనక యేమిచేసితివి?

దోమ:—ఎండకాలమంతయు నాకు సంగీతముతోను, ఆటల తోను, హాయిగా నిదురించుటతోను, కడచిపోయినది: ఆసంతోషములో ఈ వానకాలపు ఇబ్బంది నా మనసు నకే రాలేదు. ఇపుడు చింతించుచున్నాను.

తేనెటీఁగ:—మేము వసంతకాలమున చక్కని యింటిని కట్టు కొని, పువ్వు పువ్వునకును పోయి తేనెబొట్టులను సేకరిం చుకొని వచ్చి, యింట నిలువచేసికొని యీ వర్షపుదిన ములలో దిగులులేకుండ హాయిగా అనుభవించుచున్నాము: కాలమును ఆనందముగా కడపుచున్నాము. ఒకరిని యాచింప వలసిన యక్కఱ మా కేమియు లేదు. నీవు ఆ హారము చేర్చుకొనవలసిన దినములలో ఆటపాటలతో పొద్దులు పుచ్చితివి. ఇప్పుడు బిచ్చమునకు బయలుదేరితివి. పో! పో! నీవంటి సోమరిపోతుల కిచ్చుట భిక్షము

పెట్టువారు లేరు- అనెను.

అపుడా దోమ సిగ్గుపడి తలవంచుకొని, తనలో తాను ఏమో గొణుగుకొనుచు వెళ్ళిపోయెను.

---

## 3 అవివేకితో మైత్రి

వెంకన్న యను నొక కాఁపు, ఒక కోఁతిపిల్లను మిక్కిలి ప్రేమతో సాకుచుండెను. అదియు వానియందు ప్రేమయు విశ్వాసమును కలిగి రాత్రియు పగలును వాని నెడబాయక మనసు నెఱిఁగి వర్తించుచుండెను. నానాఁట పెరిగి పెద్దదియై ఆకోఁతి తన్ను పెంచువానికి యింటిపనులయందును సాయపడుచుండెను. వెంకన్న చెప్పిన చొప్పున, అది యొకప్పుడు పండ్లతోఁటకు కావలి యుండును; ఒకప్పుడు కాపరియై పశువులను మేపును; వెంకన్న లేనివేళ ఇంటికి కావలియుండును. ఇట్లావానరము వెంకన్నకు చేదోడువాదోడై యెంతో ఉపకారిగా నుండెను.

ఒకనాఁడు పగటివేళ కాఁపు నిద్రించుచుండెను. కోఁతి వాని పక్కలో కూర్చుండి యుండెను. అప్పుడొక యీఁగ కాఁపు మొగముపై వ్రాలెను. అందుకు కోఁతి కోపించి, దానిని వెళ్ళఁదోలెను. ఈఁగ పోయినట్లే పోయి మరల మొగము

మీఁద వాలెను. కోఁతి మరల తోలెను. ఈఁగ లేచినట్లేలేచి మరల వాలెను. ఇట్లు కోఁతి యెన్ని మాఱులు తోలినను వెళ్లి పోక యీఁగ మరల మరల వచ్చి ముఖముమీఁద వాలుచునే యుండెను.

కోఁతికి కోపము హెచ్చెను. " ఈచెడ్డ యీఁగ నా యజమానుని నిద్రకు పలుమాఱు భంగము కలిగించుచున్నది. దీనిని చంపివేయవలయును" అనుకొని, ఒకపెద్దబండను తీసికొని వచ్చి మొగము మీఁది యీఁగపైఁ బడవేసెను. ఈఁగ యెగిరి పోయెను. కాఁపువాని మొగము పగిలి గాయమయ్యెను.

కావున తెలివిలేనివానితో ఎక్కువ చెలిమిచేయుట తగదు.

---

## ౮ నక్క—ఒంటె

ఒక యడవిలో, ఒకనక్కయు, ఒంటెయు చాలచెలిమి గలిగి మెలఁగుచుండెను. ఒకనాఁడు నక్క "ఒంటెబావా, ఏటి యావల నొక చేనున్నది. ఆచేనిలో మంచి పచ్చిగడ్డి కొల్లగా నున్నది. నీ వాచేనికిపోయి కడుపారమేసి రా రాదా? యనెను.

ఒంటె:—అట్లయిన నీవునురమ్ము పోవుదము.

నక్క:—నేను అల్పజంతువనుగదా; లోఁతుగా పాఱుచున్న

ఆ యేటి నెట్లు దాఁటఁగలను?

ఒంటె:—దాని కేమి? నీవు నా మీఁపున నెక్కి రమ్ము. ఏఱు నిన్నేమి చేయునో చూతము—అనెను.

అంత నిరువురు బయలుదేఱిరి. ఒంటె నెక్కి నక్కయు ఏటిని దాఁటెను. ఇద్దఱును చేనిలో ప్రవేశించిరి. ఒంటె మేయు చుండెను. నక్క అక్కడగల కాయగరుబులను కడుపునిండ మెక్కి—ఒంటెను తమాషా చేయవలయు ననుకొని—ఇట్లనెను: "బావా, నా కడుపునిండినది ఇంక నేనొక కేక వేసెదను"

ఒంటె:—వలదు. వలదు. నాకింకను కడుపునిండలేదు. చేని కాఁపు మంచెమీఁద నిదురించుచున్నాఁడు అఱచితివా! వాఁడు లేచి నిన్నును నన్నును చావగొట్టును.

నక్క:—నేను కూఁతపెట్టక యుండజాల ననుచు కూయనే కూసెను. చేనివాఁడు మేలుకని, ఒక దుడ్డుకఱ్ఱను తీసికొని ఒంటెను లెస్సగా కొట్టెను. నక్క తప్పించుకొని పాఱి పోయి యేటిగట్టున చేరెను. నక్క చేసినపనికి మనసులో కుములుచు, ఒంటెయును నదీతీరమునకు వచ్చెను.

ఒంటె నక్కను చూచి, "నక్కబావా, అఱవకుమన్నను అఱచితివేమి?" యనియడిగెను. అందుకునక్క "బావా, మన్నింపుము. కడుపునిండగనే కూయుట నాకలవాటు, ఆ యలవాటు మాఁపుకొనలేక అఱచితిని" అని బొంకెను.

అంత నాయొంటె—ఇంక మనమిక్కడ నుండనేల? మన

నెలవునకు పోవుదము పదమనెను-నక్క ఒంటెవీఁపుననెక్కెను. ఒంటె యేటిలోనికిదిగి, మంచిలోఁతుగలచోట-శిన్నగా మునుగ సాగెను. అప్పుడు నక్క "అయ్యో! బావా, ఇదియేమి? ఇక్కడ మునుఁగఁ జూచుచున్నావు?" అనెను.

ఒంటె "నక్కబావగారూ, లోఁతునీటికి రాగానే మునుఁగుట నాకలవాటండీ! ఆయలవాటును నేను ఆపుకోజాలనండీ" యనుచు మునుఁగనే మునిఁగెను.

నక్క తానుచేసిన బుద్ధితక్కువ పనికి ఇదిఫలమని తెలిసికొని, మొత్తుకొనుచు కొట్టుకొనిపోయెను.

తనకు మించినవారితో తమాషాలు తగవు.

---

# ౫ మంచి రాజు

పూర్వకాలమున నొక మహమ్మదీయ రాజుండెను. అతఁడు మిక్కిలి దర్పముకలవాఁడు; ప్రజలను దయతో పాలించువాఁడు. అయినను, అవుగాములను విచారింపక ఆతఁడు చేయు ఉత్తరువులను నెఱవేర్పఁజాలక ప్రజలు మిక్కిలి తొందరపడుచుండిరి.

ఒకప్పుడతని రాజ్యమున గొప్ప వఱపు సంభవించెను. నీటికిచాల యెద్దడియయ్యెను. చెఱువులన్నియు నెండిపోయెను. బావులన్నియు నెండిపోయెను. అతని నగరమున త్రాగుటకును

నీరుదొరకని స్థితి యేర్పడెను. అప్పు డా రాజు నీరు ఎక్కువ గా గల గ్రామములను విచారించి, అచటగల బావులను తన పట్టణమునకు పంపవలసినదని, గ్రామాధికారులకు ఉత్తరువు పంపెను. బావులను పెల్లగించుటకును, పంపుటకును, ఆయధి కారులకు ఉపాయము తోచకపోయెను. బావులను పంపకున్న చో ప్రభువుగా రెట్టి శిక్ష విధింతురో యన్న భయమెక్కువ యయ్యెను.

ఆసమయమున నొక ముసలి కరణము 'ఈ యిక్కట్టును నేను తొలగింతు' నని ధైర్యముచెప్పి, నవాబుగారికి ఇట్లు మనవి వ్రాయించెను:—

మహాప్రభూ! ఇచటి బావులన్నియు నీటితో నిండియు న్నవి. నిండు బావులను బండ్ల కెత్తించుటకు వీలుకాకున్నది. కావున ఏలినవారు అచటి ఖాళీబావుల నిచటికి పంపినచో నీరుపోసి పంపుకొందుము.

ప్రభు వా మనవిని చదువుకొని- నిండుబావులను పం పుమనుట పొరబాటనియు, వట్టిబావులను పంపుట అవసర మనియు నిశ్చయించుకొనెను. అప్పుడు బావులను పెల్లగించు టకుఉపాయమును యోచించెను. ఎంతయోచించినను కుదురక పోయెను. తుదకది యసాధ్యమని తెలిసికొనెను. అప్పుడు తాను చేసిన ఉత్తరువునకు సిగ్గుపడెను. తన తప్పును తనకు తెలి యజెప్పి మహోపకారమును చేసిన ఆముసలికరణమును పిలి

పించి, గొప్పజాగీరు బహుమానముగా నిచ్చెను.

నాఁడు మొదలు ఎట్టి చిన్న యుత్తరువునైనను చక్కగా నాలోచించి చేయఁదొడఁగెను.

ఆ ముసలి కరణమువలన తమకు గలిగిన మేలునకు సంతోషించి ప్రజ లాతనిని పెద్దగా గౌరవించిరి.

---

## ౬ తగనిపని

ఒకనాఁ డొక నెమలి తనపురివిచ్చి అందముగా ఆడుచుండెను. ఆ యాటనుచూచి యొకకాకి, తానును నెమలి వేషము వేసికొని అటులనే యాడవలయునని ముచ్చటపడెను.

అందులకై యా కాకి, ఎట్లో నెమలి యీఁకలను కొన్నిటిని సంపాదించుకొని, తనఱెక్కలకును తోకకును గ్రుచ్చుకొని, తాను నిజముగా నెమలియైనట్లే భావించుకొనెను. అంతటితోనే తనవారికంటె తాను గొప్పదాననని గర్వించెను. తన సంఘమును నీచముగా తలఁచి తిరస్కరించి, మయూరములలో చేరిపోయెను.

పిమ్మట కొన్ని దినములకు వర్షాకాలము వచ్చెను. ఆకాశమున మబ్బులు ఉఱుములతో, మెఱుపులతో నటునిటు ప్రయాణము చేయఁదొడఁగెను. ఆ మనోహర సమయమున నెమళ్ళన్నియు, ఎంతో సంతోషముతో కేకలు

వేయుచు, తమ పెద్దకుంచెలను విప్పి యాడసాగెను. కాని, నెమిలి వేషమున నున్న కాకి మాత్రము ఆటకురాలేదు. కేకలును వేయలేదు. నెమళ్లు దాని లక్షణములను కనిపెట్టి ఇది నిజమయిన నెమలికాదని గ్రహించి, కోపించి, ముక్కులతో పొడిచి తమ గుంపునుండి తఱిమివేసెను

కాకి యంతట నెమలివేషమును తీసివేసి, మరల తన సంఘమున చేరఁబోయెను. అపుడు కాకులన్నియు నొకటియై. "ఏమోయీ నెమిలిదొరా, ఇట్లేల వచ్చితివి? నీ వేషమేమయినది? నీ ఠీవి యేమయినది? ఏ గర్వమేమయినది? మరల ఈ నీచసంఘమున కేల వచ్చితివి? నీవు చాల గొప్ప వాఁడవుగదా? మావంటి నీచులలో నుండుట నీకు తగునా? నీకిక్కడ చోటు లేదు. లేచిపొమ్ము" అని తఱిమివేసెను.

పాప మా కాకి తానుచేసిన తప్పిదము తలఁచుకొని దుఃఖపడుచు లేచిపోయెను!

గొప్ప వేషమమరినంతనే గొప్పవాఁడననుకొని తక్కిన వారిని తక్కువగా తలఁచుట తగనిపని.

---

## ౭ దొంగలింగడు

లింగఁడు, రంగఁడు అనునిద్దఱు బాలురుగలరు. వారిరువురును పసితనమునుండియు నెక్కువ స్నేహము గలిగియుండిరి.

ప్రతిదినమును రంగఁడు చక్కగా చదువుకొనుచు, మంచి చెడ్డలను గుర్తించుచు, పిన్న పెద్దల మర్యాదలను తెలిసికొనుచు మంచివాఁడన్న పేరును సంపాదించుచుండెను. లింగఁడు సోమరియై, చక్కగా చదువక అల్లరి పిల్లలతోఁ గలసి దుర్గుణముల కలవాటుపడి చెడ్డ పిల్లవాఁడన్న పేరు సంపాదించెను. వానికి దొంగతనము గూడ పట్టుపడెను.

రంగఁడు వాని దుర్గుణముల కసహ్యపడుచుండెను. చెలికాఁడు గావున వాని దొంగతనమును మాన్పి మంచి మార్గమునకు త్రిప్ప యత్నించుచుండెను. ఒకనాఁడు రంగఁడు తానుచేయించుకొనిన బంగారుంగరమును లింగనికి చూపెను. దాని నెట్లైనను కాఁజేయవలెనన్న దుర్బుద్ధి లింగనికి కలిగెను. రంగఁ డా సంగతిని చక్కగా కనిపెట్టెను. లింగఁ డుంగరమును దొంగిలించుటకు దారిని యోచించుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడు రంగఁడు తనవ్రేలి యుంగరమును తీసి లింగఁడు చూచుచుండఁగనే, ఒక బరిణెలో వేసి, ఆ బరిణె నొక గూటిలో పెట్టెను. లింగఁడు దానిని కొట్టివేయుటకుపాయమును యోచించుకొని యిట్లనెను: "రంగా, మాయింటనాకు చదువు సాగుటలేదు. నేఁటి నుండియు నీతో చదువుకొని మీ యింటనే పండుకొందును." అనెను. రంగఁడు "మిత్రమా, అందుకు ఆక్షేపమేమి? నీవు ఈ రాత్రికే యిచటికి రమ్ము. మన మిరువురమును కలిసి పాఠములను చదువు

కొండ" మనెను. అంతట లింగఁడింటికి పోయెను. రంగఁడా బరిణెలోని యుంగరమును తీసి, దానిలో నొక తేలును పెట్టి యుంచెను.

ఆ రాత్రి లింగఁడు చదువు నెపమున మిత్రుని యింట్లు చేరెను. ఎట్లో ప్రొద్దును కడపెను. కొంత రాత్రికి యిరు వురును పరుండిరి. రంగఁడు నిద్ర పట్టినట్లు గుఱుపెట్ట సాగెను. అపుడు లింగఁడు మెల్లగా లేచి, యిదే సమయమని గూటిలోని బరిణెను తీసికొని, మూఁత తెఱచి ఉంగరమును తీసికొనఁ బోవగా, అందున్న తేలు అంటఁ బొడిచెను. నిప్పువలె తాకి నట్లు వేలు భగ్గున మండఁగా, పాపము! ఆ పసివాఁడు ప్రాణ ములను బిగబట్టుకొని వచ్చి మంచముమీఁద కూలఁబడెను. ఆ నొప్పికి తాళలేక వేలును గట్టిగా పట్టుకొని మిక్కిలి బాధ పడుచుండెను.

అప్పుడు రంగఁడు లేచి, "ఏమి చెలికాఁడా, వేలు పట్టు కొని బాధపడుచున్నావు; ఉంగరము వేలికి సరిగా నెక్క లేదా"? అని చిఱునవ్వుతో నడిగెను. లింగనికి తేలుకాటు బాధ కంటెను అవమానపు బాధ ఓర్వరానిదయ్యెను. వానికప్పుడు తన తప్పును తప్పించుకొనుటకు తగిన త్రోవ తోఁపకపోయెను. అందువలన వాఁడు రంగని కాళ్ళపైఁబడి "సోదరా, నాకు బుద్ధివచ్చినది. నన్ను మన్నింపుము. నేనిఁక మీఁద నెన్నడు నిట్టి పని చేయ"నని చెంపలు వేసికొనెను.

రంగఁడు వానికి మంచి మాటల నుపదేశించుచు, ఓదార్చి, తేలు కాటునకు మంచిమందు వేసి యా బాధను పోఁగొట్టెను.

---

# ౭ కోతి యుక్తి

ఒక నాఁడొక కోఁతికి మిక్కిలి దాహమయ్యెను. అది నీటికొఱకు వెదకఁగా వెదకఁగా నొకబావి కనఁబడెను. దానిలో నీరు చాలలోఁతున నుండెను; దిగుటకు మెట్లును లేవు. కోఁతికి దప్పిచేత ప్రాణములు పోవునట్లుండెను. అందువలన నది నీటిలోనికి దుమికి కడుపునిండ నీరు త్రావెను. ప్రాణములు కుదుటఁబడెను. అంతట కోఁతి నలుప్రక్కలను చూచెను. బయటికి వచ్చుటకు మార్గమేమియు కనఁబడలేదు. బావి దరులు మిక్కిలి యెత్తుగ నుండెను. పట్టుకొని యెక్కుట కే విధమయిన యాధారమును లేక పోయెను. పాప మా మర్కటము చేయునదిలేక దిగులుపడి యట్లే నీటిలోఁబడి యీఁదు చుండెను. ఇంతలో, ఆబావియొద్దున కొకమేకపోతు వచ్చి తొంగిచూచి కోఁతిమామా, యీ బావిలోని నీరు మంచి నీరేనా? అని యడిగెను.

కోఁతి:—మంచినీరేనా ! ఇంతకమ్మని నీరు నే నెన్నఁడును త్రా

వి యెఱుఁగను. ఇది యమృతముగాని, నీరా! యింకను ఆ లసించెదవేల? రమ్ము రమ్మనఁగా మేఁకపోతు చంగున నీటిలోనికి దుమికెను. వెంటనే కోఁతి మేఁకపోతు వీఁపు మీఁదికెక్కి, అటనుండి యెగిరి యొడ్డుకు చేరెను.

మేఁకపోతు నీరుత్రావెను. బావినుండి పైకి వచ్చుటకు త్రోవతోఁపక-కోఁతిని పిలిచి, "ఓయీ, నేను పయికి వచ్చుటె ట్లు" అనియడిగెను. అపుడు కోఁతి "అయ్యా, నేనక్కడ నుండఁ గనే యేల చెప్పకపోతివి? చెప్పియున్నచో ముందు నిన్నుపై కెగురవైచి పిమ్మటనే నేనువచ్చి యుందునుగదా! ఇపుడేమి చేయవచ్చును? గడ్డమును నీటదడిపి జాడించుకొనుచు, అచ టనే పడియుండు" మని తనదారిని తాను పోయెను.

ఏపనిని గాని ముందు చక్కగా యోచింపక చేయరాదు.

---

# ౬ మంచిమంత్రిలు

ఒక యడవిలో నొకపెద్దపులి ప్రభుత్వము చేయుచుం డెను. ఆప్రభువుకడ నొక హంసయు, నొక చిలుకయు మంత్రు లై రాజ్య తంత్రమును నడపుచుండిరి.

ఒకదినమున నొక బ్రాహ్మణుఁడు ఆమార్గమున పోవు చుండఁగా పెద్దపులి కంటఁబడెను. ఆవిప్రుఁడు భయముచే వడఁ

కుచు - నేటితో నాయాయువు తీఱినదనుకొని, కదలక మెదలక నిలువఁబడెను. అపుడు హంస పులితో నిట్లనెను "ప్రభూ, ఆ బ్రాహ్మణుఁడు గొప్పపండితుఁడు: పరమ సాధువు: మిమ్ము గని భయపడుచున్నాఁడు. ఆమహాత్ము నాదరించి ఆతని వలన సదుపదేశములను పొందుట మనకు లెస్స"యని చెప్పెను. చిలుకయును; "అవునవును! అట్టి పండితుల వలన మంచివిషయములను గ్రహించుటయు, వారిని గొప్పగ సత్కరించుటయు ప్రభువుల కవశ్య కర్తవ్యము" అని పలికెను.

అంగులకు పులి సమ్మతించి లేచి, విప్రుని సమీపమునకు పోయెను. అది తనను చంపవచ్చుచున్నదని ఆతఁడు గడ గడ వణఁకెను. పులి"అయ్యా, భయపడకుము" అని ధైర్యము చెప్పి నమస్కరించి, "స్వామీ, మాకుమీరు మంచివిషయముల నుపదేశింప వలయు" నని ప్రార్థించెను.

ఆతఁడు ధైర్యము తెచ్చుకొని, పులివెంట నడచిపోయెను. మంత్రులతోఁగూడి పులిరాజొకచోట కొలువుతీరెను. బ్రాహ్మణుఁడు నిర్భయముగా అనేక ధర్మోపన్యాసములు చేసెను. శార్దూలము మిక్కిలి సంతోషించెను. తుట్టతుద కా బ్రాహ్మణుఁడు "పులిరాజా, నీమంత్రులుత్తములు;ఉత్తమ మంత్రులుగల ప్రభువు సజ్జనులకుసేవ్యుఁడగును; దుష్టులను చేర్చుకొను ప్రభువును లోకము నిందించును. ఈమాట నెప్పటికిని మఱవకుము" అని యుపదేశించెను.

పెద్దపులి సంతసించి, ఆవిప్రునకు మోసినంత బంగారును బహుమానముగా నొసఁగి పంపించెను.

ఆతఁడు పట్టరాని సంతోషముతో నిల్లు చేరెను. నాఁడు మొదలతనికి దరిద్రబాధ తొలఁగి పోయెను. అంతకుముందు కడుపునిండ తిండిలేక కృశించుచున్న ఆబ్రాహ్మణుఁడు నాఁటి నుండి తృప్తిగా భుజించుచు, నానాట బలుపుచెందెను. ఇట్లు కొంతకాలము జఱుగగా కాలక్రమమున నతని కడనున్న బంగారంతయు తఱిఁగి పోయెను.

ఆవిప్రుఁడు మరల పులిని దర్శించి ధనమును సంపాదించుకొనఁగోరి అడవికి పోయెను. నక్కయు కాకియు మంత్రులై కొలువ పులిరాజు కొలువుతీరి యుండెను. వానిని చూచినంతనే బ్రాహ్మణుఁడు, ఆశవదలుకొని దూరముననే నిలిచి పోయెను; అపుడు నక్క పులిని చూచి “మహారాజా, ఆ నిలిచియున్న మనుష్యుఁడు చియ్యబట్టి బలిసి యున్నాఁడు. వాని మాంస మేలినవారికి ఈదినమునకు సరిపోవును” అనెను.

కాకి:—అవునవును; వానిని పోనీయరాదు. ఆలసించినచో వాఁడు పరువెత్తి తప్పించుకొను-ననెను. అంతట పులి లేచి వాని సమీపమునకు పోయి “స్వామీ, ఇఁక మీరు మా సంస్థానమునకు రాకుఁడు. మునుపటి మంత్రులిరువురును కాలము చేసిరి; ఇప్పటి మంత్రులిరువురు మిమువంటి వారిని సత్కరించుటకు సమ్మతింపరు” అనిచెప్పి ఆతనిని దూర

మునకు పిలుచుకొని పోయి కొంతధనమిచ్చి పంపించెను.

---

## ౧౦ మోసమునకు తగిన ఫలము

ఒక గాడిద పులితోలు కప్పుకొని పంటచేలలో ప్రవేశించెను. చేలకాఁపరులు దానిని చూచి పులియని భావించి భయపడి పరుగెత్తిరి. అంతట నది నిర్భయముగా పొలమెల్ల తిరిగి కడుపునిండ మేసి తనదారిని తానుపోయెను. ఇట్లా గాడిద ప్రజలను మోసముచేసి ప్రతిదినమును పొట్టపోసికొనుచుండెను: ఇట్లుండగా నొకనాఁడు అది యెప్పటి చొప్పున నొక చేనిలో ప్రవేశించెను; చేనికాపరి చెట్టుపై నక్కియుండెను. ఆ చేనిలో నంతకుముందే కొన్ని గాడిదలు మేయుచుండెను; వానిని చూడఁగనే పులివేషమునఁనున్న గాడిద అలవాటుచొప్పున నోండ్రపెట్టెను. చేనికాపరి దాని కూతవిని: "ఔరా! దీని వేషమునుచూచి యింతకాలమును మోసపోతిమి. ఇది గార్ధభముగాని శార్దూలముకాదు; దీనికి తగిన ప్రతిఫలమును ముట్టజెప్పవలె ననుచు చెట్టుదిగివచ్చి, ఒకబడియ చేకొని దానిని పడిపోవునట్లు కొట్టెను.

---

# ౧౧ కప్ప—పాము

ఒక చెఱువులో కొన్ని కప్పలు నివసించుచుండెను. వానిలో నొక ముసలి కప్ప ఆ కులమునకు పెద్దయై పెత్తనము చేయుచుండెను. కాల క్రమమున, ఆ కప్పకు గర్వము ముదిరెను. మాట మాటకును కోపించుచు, చిన్న కప్పలను బాధింప మొదలు పెట్టెను; జోలి మాలిన పనులకెల్లను వచ్చి తన పెత్తనమును అక్రమముగా చెలాయింపఁ దొడఁగెను; అంత కంతకును దాని దౌర్జన్య మెక్కువయ్యెను. ఆ దౌర్జన్యమునకు తాళఁ జాలక పిన్న కప్పలన్నియు నేకీభవించి ముసలి కప్పను పెత్తనమునుండి తొలఁగించెను. అంతల నా కప్ప కోపగించి తా నొంటియగుటచే వాని నేమియు చేయఁజాలక యెగురుకొనుచు నొక పాముకడకు పోయెను. ఆ కప్పను చూడగనే పాము నోరువిప్పి పట్టుకొనఁ బోయెను. అప్పుడా కప్ప—"సర్పరాజా, నన్ను పట్టుకొనకుము. నేను నీకు చాల దినములకు సరిపోవునన్ని కప్పలను చూపింతు" ననెను. ఆమాటకు పాము సంతసించి—"అట్లయినచో మఱి కదలుము. ఆ కప్ప లున్నచోటు చూపింపుము" అని తొందర పెట్టెను.

ముసలి కప్ప "ఆయ్యా, తొందరపడకుము. ఆ కప్ప లెక్కడికిని పోవు, ఇంకను వెలుతురున్నది. మన సడి తెలిసినచో నవి తప్పించుకొని పాఱిపోవును. కొంచెము చీఁకటి పడిన

పిమ్మట పోయితిమేని మన పని సులభముగా నెఱవేర్చుకొని రావచ్చు"నని చెప్పెను. ఆ పలుకులకు పాము సమ్మతించెను. ఇంతలో పొద్దు కుంకెను: చీఁకటులు క్రమ్ముకొనెను.

పాము:—కప్పా, మనమిఁక కదలి పోవుదము. నీవు త్వరగా నడువఁజాలవు. కావున నా వీఁపున నెక్కి రమ్మనెను. కప్ప తన కోదవిన గొప్పతనమున కుబ్బుచు పాము వీఁపెక్కి పయనమై పోయి, పామును తనవారున్న తావునకు చేర్చి వాని వాని యిరవులను తెలియ చెప్పెను. పాము మెల్ల మెల్లగా పా్రఁకి కడుపునిండ కప్పలను తిని మరల ముసలి కప్పతో తన యునికి పట్టునకు పోయెను.

ఇట్లొక కొన్ని దినములలో ఆపాము చెఱువున గల కప్పలను అన్నిటిని భక్షించెను. అవ్వలి దినమున ఆహారము దొరకనందున తనకడనున్న ఆ ముసలి కప్పను పట్టుకొనెను. అప్పు డా కప్ప గొప్ప రోదనము చేయుచు: "అయ్యో! ఇంతటి అన్యాయ మెచ్చట నైనను కలదా? నా బందుగుల నందఱను నీకెర గావించి యింతకాలము నిన్ను పోషించితిని, అట్టి నన్ను మన్నింపక నీవాత పెట్టుకొనెదవా? "అని మొత్తుకొనెను.

పాము:—ఓరి దుర్మార్గుఁడా, బంధువులను చంపించిన నిన్ను మన్నింపవచ్చునా? నీవు నాకైనను ఇట్టి ద్రోహమును చేయువాఁడవేగదా"

అనుచు దానిని నమలి నమలిమ్రింగివేసెను.

---

## ౧౨ న్యాయపద్ధతి.

జహాంగీరు, అక్బరు పాదుషా కుమారుఁడు; అతఁడు పసితనము నుండియు మిక్కిలి దయగల వాఁడును, న్యాయమునందే దృష్టి గల వాఁడును నై యుండెను. అతఁడు రాజయిన పిమ్మట ప్రజలను మిక్కిలి మక్కువతో పాలించుచుండెను. జనుల కష్ట సుఖములను చక్కఁగా విచారించుచుండెను. తన ప్రజలు చెప్పికొను మొఱలను ఓర్పుతో విని, వారల యిబ్బందులను తొలఁగించుచుండెను.

మఱియును, ఆ న్యాయమూర్తి తన భవనమున నొక పెద్ద గంటను కట్టించి, దాని త్రాటిని కోట వెలుపలి ద్వారమునఁ గట్టించెను. తన దర్శనమును కోరువారెవ రైనను త్రాటిని గదిలించి గంటను మ్రోఁగించినచో ఎట్టి సమయము నైనను దర్శన మిత్తునని యెల్లఱకును దెలియపఱచెను. ఒకదినమున పాదుషా తన భార్యతో సంభాషించుచుండఁగా గంట మ్రోత వినఁబడెను. ఆ గంటను మ్రోఁగించిన వాని హాజరు పెట్టవలసినదని రాజు వెంటనే ఆజ్ఞ చేసెను. భటులొక యువతిని ప్రభువుగారి యెదుటికిఁ గొని తెచ్చిరి. పాదుషా,

ఆ పడఁతిని ఆదరించి—నీ వెవ్వరిదానవు? ఏమి పనికై వచ్చితివి? అని శాంతముగా ప్రశ్నించెను.

అప్పుడామె యిట్లు మనవి చేసెను:—

మహాప్రభూ! నేను చాకలి దానను. నేఁడు కోటలో నుండి ఒక తుపాకిగుండు వచ్చి తగిలి నా భర్త మరణించినాఁడు. నాకు మఱి దిక్కు లేదు.

ఆమె పలుకులు విన్నతోడనే, రాజు తన యుద్యోగులను పిలిపించి, తుపాకిని పేల్చిన వారెవరో విచారించి తెలుప వలసినదని ఉత్తరువు చేసెను. వారును బహుప్రయత్నమున నిజమును తెలిసికొని వచ్చి—మహారాజా! ఏమని విన్నవింతుము. తుపాకి పేల్చినవారు నూర్జహాను మహారాణిగారే అని తేలినది. పిమ్మట యేలిన వారి చిత్తము;—అనిరి.

అప్పుడు సభ్యులందఱును, వెఱఁగుపడిరి. న్యాయపక్షపాతి యగు ప్రభు విపుడెట్టి న్యాయమును చేయునో చూడ వలయునని కొందఱు గుసగుసలాడిరి. అపుడు జహాంగీరు పాదుషా, ఒక తుపాకిని తెప్పించి, అందఱును చూచుచుండగనే, అందు తోటా నెక్కించి, ఆ తుపాకిని చాకిత చేతికిచ్చి—మాచట్టము ప్రకారము హత్యకు మాఱు హత్యయే. నా భార్య నీ భర్తను చంపి నిన్ను విధవను చేసినది. కావున నీవును దాని భర్తను ఈ తుపాకితో చంపి దానిని విధవను చేయుము. దాని భర్తయగు నేను నీయెదుట నిలిచియున్నాను.

నీవు జంకవలసిన పనిలేదు. కానిమ్ము, తుపాకిని పేల్చుము-అని ధీరముగా నిలుచుండెను.

ఆ భయంకర సమయమున నచ్చటనున్న వారందఱును నివ్వెఱపాటున నిశ్చేష్టితులయిరి. అట్టిపట్టున ఆ రజకాంగన— ప్రభూ! నేను బదులు తీర్చుకొనుటకు ఇచ్ఛగింపను. కాలవశమున మహారాణిగారు చేసిన పొరఁబాటును మన్నించుచున్నాను- అని నిండు మనముతో ననెను.

దాని ఉదారవచనములకు రాజు సంతసిల్లి " ఓసి ఉత్తమురాలా! నీవు కులమున తక్కువదైనను గుణమున నెక్కుడైనదానవు. నీ యుత్తమగుణమునకు మెచ్చితిని. ప్రత్యపకారము చేయుట నీకు సమ్మతము కాదంటివి. కావున నేను నూర్జహానుకొసఁగిన జాగీరు గ్రామములలో సగము నీ కిచ్చుచున్నాను. కాదనక పైకొనుము- అని సర్వాధికారములతో అప్పుడే వ్రాసియిచ్చెను. ఆ నరపాలుని న్యాయపద్ధతిని జగమంతయు మిగుల పొగడెను.

ఆ గ్రామములు నేటికిని ఆ చాకలివంశమునకే చెందియున్నవని వాడుక.

---

# ౧౨ మంగలి యుక్తి

ఒక యూరిలో నొక మంగలి కలఁడు. వాఁడొకనాఁడు సమీప గ్రామమునకు బోయి పని చూచుకొని తిరిగి వచ్చుచుండెను: పగలు పన్నెండు గంటల సమయమయ్యెను. అది ఎండకాలము. కావున, సూర్యుఁడు మిక్కిలి తీవ్రముగా వెలుఁగుచుండెను. వాఁ డా యెండదెబ్బకు తాళలేక మార్గమునను న్న యొక పెద్ద మఱ్ఱి క్రిందికిపోయి, చంకనున్న పొదిని క్రిందపెట్టి కూర్చుండెను. ఇంతలో నొక భూతము చెట్టు నుండి దిగి వచ్చుచుండెను. దానిని చూడగనే వాని గుండెలు దద్దరిల్లెను; దేహము కంప మొందెను. భూతము వాని యెదుట నిలిచి భయంకరముగా కేక వేసి వానిని పట్టుకొనఁబోయెను. అప్పుడు వాడు ధైర్యము తెచ్చుకొని, ఒక యుక్తిచేసెను: లేచి తన పొదిలోనున్న పెద్ద యద్దమునుతీసి చేతపట్టుకొని "ఓహో! నీకై నేను వెదకుచుండగా నీవే వచ్చితివా! మంచిపని చేసితివి. మా రాజగారు రెండు భూతములను పట్టుకొని రమ్మనిరి. ఇదిగో దీని నింతకు ముందే పట్టితిని, ఇఁక రెండవ దానివి నీవు చిక్కితివి, నిన్ను పట్టి కట్టివేసి లాగుకొని పోవుదును" అనుచు తన చేతియద్దమును భూతమున కెదుట పట్టెను. అది యద్దములోని తన ప్రతిబింబమునుచూచి, మంగలిమాట నిజమే యని నమ్మి, భయపడి "అయ్యా, నీ పాదములకు మ్రొక్కె-

దను. నన్ను విడిచిపెట్టుము. నీకు కోరినంత ధనమిత్తు"నని బతి మాలెను. అప్పుడు మంగలి అట్లయిన" నాకిపుడు వేయివరహా లను తెచ్చియిమ్ము; లేకున్న నిన్ను వదలను"అని బెదరించెను. భూతము గడగడ వణకుచుఁ బోయి, వేయివరహాలను మూటకట్టుకొని వచ్చి వాని కర్పించి, చావు తప్పించుకొనినట్లు పరుగెత్తెను. మంగలివాఁడు వరాల మూటను నెత్తిన బెట్టు కొని సంతోషముగా తన యిల్లు చేరెను.

యుక్తిగలవాని కెప్పుడును ముప్పులేదు.

---

## ౧౮ నేనుగూడ దొంగనేనా?

చాలకాలము క్రిందట గ్రీసుదేశమును సికందరు అను రాజు పాలించు చుండెను. అతఁడు చాల బలవంతుఁడును, సాహసికుఁడునునై యుండెను. ఆరాజు బాహుబలమున పలువురు రాజులను జయించి వారిదేశములను ఆక్రమించెను. అతఁడు హిందూదేశము మీఁదికిని దాఁడి వెడలియుండెను.

అతని రాజ్యమున నొకదొంగయుండెను. వాఁడు మిక్కిలి క్రూరుఁడై గ్రామములను కొల్లగొట్టుచు ప్రజలను మిక్కిలి బాధించు చుండెను. జనులు వానివలని బాధలు పడఁ జాలక ప్రభువుతో మొఱపెట్టుకొనిరి. ఆదొంగను పట్టుకొ నుటకు రాజు చాల ప్రయత్నములు చేసెను. కాని వాఁడు

చాలకాలము వఱకును పట్టుపడక పోయెను.

అట్లు కొంతకాలము జరిగిన తరువాత—ఒక నాఁడు దైవ వశమున ఆ దొంగ పట్టుపడెను. భటులు వానిని రాజు ఎదుటికి తెచ్చి నిలుఁవబెట్టిరి. అపుడు వారికిరువురకు నిట్లు సంభాషణము జరిగెను:—

రాజు:— నీవు నారాజ్యమున అక్రమ ప్రవర్తకుఁడవై అల్లరి చేయుచున్నావని చాల కాలము నుండియు విను చున్నాను. నేఁటికి పట్టుపడితివి. నీవుచేసిన క్రూర కార్యములకు నిన్ను కఠినముగా శిక్షింప నిశ్చయించితిని. ఏమి చెప్పికొనెదవు?

దొంగ:—మహారాజా, అట్టి కఠిన దండనమునకుఁ దగిన తప్పు నేనేమి చేసితిని?

రాజు:—బుద్ధి హీనుఁడా, పగలు దారులడ్డగించి బాటసారులను బాధించి దోపిడులు చేసితివి. రాత్రులయందు కన్నములు కొట్టి యిండ్లలో నున్న ధనమును దొంగిలించితివి. పలువురను తోడు చేసికొని పల్లెలపైఁబడి కొల్ల గొట్టితివి. అన్యాయముగా నెందఱనో కాలుసేతులు విఱుగ మోదితివి. నీవు చేసిన క్రూరకర్మములకు మేర గలదా? అట్టి నీవు, ఇంకను సిగ్గులేక నేనేమి తప్పు చేసితి ననుచున్నావా?

దొంగ:—ప్రభూ, కోపము సేయకుఁడు—మన్నించి నావి

నవి వినుఁడు. నిజమును విచారించు వో మనమిరువురమును సమానులమే యగుదుము! ఎట్లంటిరా: నేను చిన్న దొంగను. మీరు పెద్ద దొంగలు. నేను చిన్న చిన్న పల్లెలను దోచితిని; తాము పెద్ద పెద్ద పట్టణములను దేశములను దోచితిరి. నే నొకనూఱు మందిని హింసించి యుందును; తాము లక్షల కొలఁది జనులను హింసించి యుందురు. తమదాఁడివలన నెన్ని పట్టణములు పాడైనవో ఎన్ని కుటుంబములు నశించినవో, ఎంతద్రవ్యము దగ్ధమైనదో తామెఱుఁగరా?

రాజు:—ఓరీ, నేనొక దేశమును కొల్లగొట్టినచో మఱియొక దేశమును బాగుపఱిచితిని. ఒక రాజును దోచినచో మఱియొక పేదవానిని రాజును చేసితిని. కొల్లగొట్టి తెచ్చిన ధనముతో నాదేశమున విద్యాలయములు, ఆరోగ్య గృహములు నిర్మించి ప్రజలకు మేలు కలిగించితిని. నీవలన ప్రజలకు గలిగిన మేలేమి కలదు?

దొంగ:—నాకు తగిన మేలును నేనును చేసితిని. ధనికుల యిండ్లు దోచి బీదలకిచ్చితిని. కుడువఁ గూడును, కట్టగుడ్డయును లేక మిడుకుచున్న నామిత్రులకు పలువురకు ఆ లేమి పోఁగొట్టితిని. నావలన నెందఱో జనులు ఎన్నో విధముల సుఖపడుచున్నారు. తమ సేవకుల కంటెను నాసేవకులు దిగులు, చింత, లేని స్వాతంత్ర్యమును,

సుఖమును అనుభవించుచున్నారు. మహారాజా, మఱి తమకును నాకును భేదమేమిటగలదో సెలవిచ్చెదరా? అనెను. ఆమాటలు రాజున కాశ్చర్యమును గలిగించెను. మఱియు ఆ పలుకుల నిజమును తలఁచుకొన్న కొలఁదిని రాజునకు తనవర్తనమునఁగల తప్పు మనస్సునకు గోచరించెను. అతఁడు దొంగనువదలివేసి, తనచరిత్రమును తర్కించుకొని "ఔరా—ఏమీ! నేనుగూడ దొంగనేనా?" అనుకొనెను.

